# గ్రామోద్ధరణ

(స్త్రీ పాత్రలేని నాటిక)



రచన

**చక్రధర్,** B Sc B Ed



ప్రతులకు

**విజ్ఞాన సాహితి**

విజయవాడ - 8

## అంకితం

గ్రామసీమలలో నివసిస్తూ

గ్రామాభ్యుదయాన్ని కాంక్షిస్తూ

గ్రామోద్ధరణకు పాటుపడే

గ్రామవాసులు అందరికీ

చక్రధర్.

# మనవి

ఈ నాటికలోని పాత్రలు కేవలం కల్పితములు ఎవరినీ ఉద్దేశించి వ్రాసినవి కావు దీనిని ప్రదర్శించేముందు నాకు తెలియపరచిన చాల సంతోషం అవసరమైన సలహాలు ఉచితముగా యివ్వబడును ప్రదర్శన వివరములు దృష్టిలో నుంచుకొని మరికొన్ని రచనలను మీముందు ఉంచు అవకాశమును నాకు కల్పించుటకే మీ ప్రదర్శన కార్యక్రమాలను నాకు తెలియజేయవలయునని మనవి చేయుచున్నాను

చక్రధర్

# హెచ్చరిక

ఈ నాటికకు సంబంధించిన సర్వహక్కులు నాకు చెంది యున్నవి దీనిలోని మాటలు పాటలు ఏవిధంగానూ ఉపయోగించరాదు వ్యతిరేకించి వ్యవహరించిన వారు నాచే జరుగుడు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని ఇందుమూలముగా తెలియపరచడమైనది

చక్రధర్.

# ప్రథమ, ద్వితీయ ప్రదర్శనలు

'గ్రామోద్ధరణ' నాటికను గుడివాడ శ్రీ అక్కినేని నాగేశ్వరరావు కళాశాల నేషనల్ సర్వీస్ స్కీమ్ విద్యార్థులు వారి క్యాంపు ఉత్సవ సందర్భములో ప్రథమ ప్రదర్శనగా భూషణగుళ్ల హరిజన కాలనీలోను, [illegible] వార్షికోత్సవ సందర్భములో ద్వితీయ ప్రదర్శనగా డాక్టరు గురురాజు హోమియో మెడికల్ కళాశాలలోను ప్రదర్శించి ప్రేక్షకుల మన్ననలను పెద్దల ప్రశంసలను పొందియున్నారు ఆ ప్రదర్శనలలో పాల్గొనిన కళాకారులు

| పాత్ర | పాత్రధారుడు |
|---|---|
| షేక్ | Md నజీరుద్దీన్ I B Sc |
| సాయి | [illegible] G V ప్రసాద్ I B Sc |
| అయోమయం | K రామలింగేశ్వరరావు II B Sc |
| గందరగోళం | P రామకృష్ణ Senior Inter |
| రామయ్య | U S R మోహనరావు II B Sc |
| వాసు | T రాజారాం I B Sc |
| దాసు | T లక్ష్మణరావు I B Sc |
| పిచ్చివాడు | T, R N టాగోర్ II B Sc |
| శాస్త్రి | T పురుషోత్తమరావు I B A |

# గ్రామోద్ధరణ

[ తెరవెనుక ]

## ప్రబోధగేయం

లేవరా! గ్రామవాసి! లేవరా!

ఊదరా శంఖమూ! ఊదరా!

1 నవ్యనవ్య నవోదయం శుభప్రదమగు శుభోదయం
మానవాళి మహోదయం పొంగిపొరలు మనహృదయం
జాతికి సేవలుచేయగ నీతిగ ముందుకురారా
మంచికి మారుగ నిలచి జాతిపేరు నిలుపుమురా ॥లే॥

2 గ్రామవాసులం మనము గ్రామసీమలే మనవి
రామరాజ్యం మనది గ్రామరాజ్యం మనది
గాంధిదండులా లేచి రామదండులా తిరిగి
సత్యాహింసలు అంటూ శాంతివిప్లవం లేప ॥లే॥

3 జాతిపిత బాపూజీ జాతినేత నెహ్రూజీ
శాంతిదూత శాస్త్రీజీ శాంతిమాత మన ఇందిర
శాంతి శాంతి మనకాంతి హింస హింస మనవైరి
శాంతి కాంతి దివ్యజ్యోతి అహింసే పరంజ్యోతి ॥లే॥

4 కులమత భేదం వలదు పార్టీకక్షలు వలదు
కయ్యానికి దిగవద్దు నెయ్యంబే మనధ్యేయం
సంకుచితపు భావాలను మనసులోనికి రానీయకు
సమానత్వమనుమాటను మనసునుండి పోనీయకు ॥లే॥

5, ఉత్సుకతో నడుంకట్టి ఉత్పత్తిని సాధించు
జనాభా పెరుగుదలను అరికట్టగ రాముందుకు
ముగ్గురు బిడ్డలు మీరు ముచ్చటగ జీవించి
ఆయువు ఆరోగ్యాలు ఐశ్వర్యాలను పొందుము॥ లే॥

6 మాలమాదిగల నెల్ల పూలమాలలనె గాంధి
అంటరానితనంబును అకుగంటింపగ చేయ
శుచి శుభత లేనివాడె అంటరానివాడంచు
గ్రామోద్ధరణకు నీవు వేగమె ముందుకురారా!॥ లే॥

[ తెర లేస్తుంది అది గ్రామంలోని రచ్చబండ స్టేజీకి కుడివైపునుండి పేపరు (దినపత్రిక) చదువుకుంటూ శేఖర్ వస్తాడు ఎడమవైపునుండి కోటాయి ఒరుగెత్తుకుంటూ కుడివైపుకు వెళుతూ ఉంటాడు ]

శేఖర్ కోటాయి ! ఎక్కడికలా పారిపోతారు ?

కోటాయి పాలానికి బాబూ !

శే గూడెం విడిచి పాలెం వెళ్ళడం దేనికి ?

కో తలదాచుకోడానికి !

శే అదేమిటి కోటాయి ?

కో అవును బాబూ ! మొన్ననగా మొదలెట్టిన కలరా ఊరిమీదపడి ప్రజలనెత్తురంతా పీల్చేస్తోంది ఇప్పటి కప్పుడే చింతాలు చిన్నబ్బాయిని, పేరిగాడి పెద్ద బ్బాయిని పొట్టన పెట్టుకుంది

శే ఆఁ !

కో , లచ్చాయి పెళ్ళాం లచ్చి, కనకాయి పెళ్లాం కనికి కూడా నమ్మకం లేదంటున్నారు బాబూ !

శే ఏమిటి ?
క్రో ప్రజలు కుప్పలు కుప్పలుగా పడున్నారు
శే ఆఁ
క్రో మీకీవిషయం తెలియదా బాబూ !
శే విశాఖపట్నం వెళ్లి వారం రోజులైంది ఈరోజే
వచ్చాను పట్నంలో గవర్నమెంటు డాక్టరుగారికి,
ఆరోగ్య సిబ్బందికి కబురుచేస్తే బాగుంటుంది
(వెళ్ళబోతాడు)
క్రో ఎక్కడికి బాబూ !
శే వాళ్ళదగ్గరకే
క్రో అంతా వాళ్ళని విడిచిపెట్టి వెళ్తుంటే మీరక్కడికి
వెళ్తారా ?
శే , అవును కోటాయి ఎవ్వరూ లేకపోతే వాళ్ళగతేంకాను
వాళ్ళలా నిస్సహాయతతో నాశనం కావలసిందేనా !
క్రో దానికి మనం ఏంచేత్తాంబాబూ అంతా ఆ దేవునిదయ
శే అని ఊరుకుంటే ఎలా చెప్పు గాలిలో దీపంపెట్టి
దేవుడా నీదయం అంటే సరిపోతుందా !
క్రో సరిపోకపోతే చచ్చేవాళ్ళకు అడ్డుపడతావా ?
శే తప్పకుండాను
క్రో యములోళ్ళను ఎదుర్కొంటావా ?
శే నిర్భయంగా
క్రో అంతా విడిచి అగ్గిలో మాకుతావా ?
శే నిశ్చింతగా
క్రో వద్దుబాబూ వద్దు ఎల్లిపోదాం రండిబాబూ !

శే (నవ్వు) వెర్రివాడా! వెళ్ళిపో తేమాత్రం వెంబడిస్తూ నృత్యంచేసే మృత్యువు జాలితెలుస్తుందా? జీవికి మృత్యువాసన్నమైనప్పుడు ఎక్కడున్నా ఒక్కటే గాఢ వ్యక్తిని పరీక్షిస్తుంది ధైర్యంగా నిలబడి శౌర్యంగా ఎదుర్కోవాలిరా నీవుకూడా రా

గో నేనా?

శే అవును

గో బతికుంటే బలుసాకు తినొచ్చు నేను రానుబాబు

శే పిచ్చివాడా! ప్రాణాలను గుప్పెట్లో పెట్టుకొని ఎంతకాలం జీవిస్తావు? తోటిమానవుని ప్రాణం పోతుంటే సాటి వాడు పారిపోవడమా? ఇంతకన్నా పాపం ఇంకే మైనా ఉందా? ఆ పాపానికి ప్రాయశ్చిత్తంఉండదు ఆ ఆత్మకు ఆరాధన ఉండదు ఆ జన్మకు క్షమాపణ లేదు

గో బాబూ!

శే ఏ జీవి ఆ శాతిగుండెకు జాలిచూపదు

గో బాబూ!

శే ఏ ప్రాణి ఆ కఠినహృదయానికి సానుభూతి కనపర్చదు

గో, బాబూ

శే వెళ్ళిపో పిరికితనము పిరికివాళ్ళను మరీ పిరికివాళ్ళనుగా చేస్తుంది పిరికిమందును మరికాస్త సేవించి పారిపో

గో మీమాట వింటూంటే నాలో మార్పు కల్గుతుంది ఎప్పుడూ ఎరుగని ఆనందం నాకు కనబడుతుంది

శే అంతే ప్రతివానికి ఉత్సాహం కలిగించే ఉద్యమాన్ని ప్రవేశపెట్టాలి దానికిగాను నిదురపోతున్న మూగ ప్రకృతిని మేల్కొల్పాలి అణగివున్న ఆవేశాలను పైకి పెకలించి అంతులేని అనాచారాల్ని అట్టడుగున పాతిపెట్టాలి కులగోత్ర భేదం లేకుండా అంతా కలసి మెలసి పనిచేయాలి జాతిమత విభేదం లేకుండా ఒకరినొకరు సన్నిహితంగా సంచరించాలి

కో అనుకోవడమేకాని అది నిజవాకము అవుతుందంటారా బాబూ?

శే ఆచరణలో చేసి చూపించితేగాని నీ అనుమానము తీరదు

కో అసలు మీరు మా గ్రామానికి రావడం నాన్నగారికి తెలిస్తే అగ్గిమీద గుగ్గిలమైపోతారు మాతో మీరు మాట్లాడటమే ఆయనకు గిట్టదు పైగా మాకు సేవ చేసి సహాయం చేయాలనుకుంటే మీ అంతట మీరు కష్టాలను కొని తెచ్చుకున్నట్లవుతుంది బాబూ

శే మరేం ఫర్వా లేదు

కో అది కాదు బాబూ మేము అంటరానివాళ్ళమని మాలమాదిగలను అంటుకుంటే మహాపాపాలు చేసినట్లేనని అనుకునే మీ నాన్నగారు

శే మా నాన్నగారు ఒక్కరే కాదు కోటాయి, అలాంటి వారు చాలామంది ఉన్నారు ఈ సమాజంలో బూజుపట్టిన పాతభావాలను వారి మనసునుండి పారద్రోలాలి మాలమాదిగలను పూలమాలలన్న

బాపూజీ బోధనలను వారిదృష్టికి తేవాలి 'అంటరానితనాన్ని జయించటానికంటే వ్యాయామం వరించటం మేలు అన్న మహాత్ముని సందేశాన్ని ప్రజానీకానికి బోధించాలి

కో ఏమో బాబూ? అదంతా నాకు తెలవదు మీ వెనకాల ఉంటా మీరేంచేయమంటే అదిచేస్తా ఆదరం ఒక్కటైతే సంపాదించాను

శే అయితే రా వెళ్దాం (ఎడమవైపుకు వెళ్తారు)

(కుడివైపునుండి అయోమయం, గందరగోళం వస్తారు)

గంద ఇటుపోతే కలరా అటుపోతే మశూచికము ఎల్లాగురా చచ్చేది?

అయో అంతా అయోమయంగా ఉందిరా ఒరేయ్! మా నాన్న నిన్ననగా చచ్చిపోయాడు స్మశానానికి తీసుకుని వెళ్ళకుండా అక్కడే ఉంచితే ఎల్లాగురా?

గంద ఏడ్చినట్టే ఉంది స్మశానానికి తీసికెళ్ళితే మీ నాన్నతోపాటు నీవుకూడా పరలోకానికి పాస్‌పోర్టు పుచ్చుకుంటావు ఆదెబ్బతో నీమాట నాకువినిపించదు నీముఖము నాకు కనుపించదురానాన్నా

అయో నేను వెళుతూ నిన్ను వదలిపెడతానటరా ఎక్కడికెళ్ళినా మనిద్దరము ఒకటిగానే ఉంటాంరా

గంద చచ్చాం పో అందుకే అన్నారు గోటిపెనుగు లేనిదే రాచపీనుగు కదలదని ఇంతకూ మీనాన్న చచ్చిపోతూ ఏమన్నా ఇచ్చిపోయాడట్రా

అయో ఇచ్చిపోతే చచ్చిపోతేమాత్రం ఏరా ఏమీలేదు
కనకనే ఈ విడుపు
గంద చివివేయకురా నాన్నా నేనుండగా నీకొచ్చే
ఇబ్బంది ఏమీ లేదురా
అయో అనకనే అట్టట్టా బతికున్నా
గంద లేకపోతే ?
అయో ఎప్పుడో చచ్చిపోయేవాణ్నిరా !
గంద అంకకేరా నిన్ను అయోమయం అన్నాను నువ్వు
చావాలనుకుంటేమాత్రం యమలోకంలో నీకు టాళీ
ఉండొద్దటా
అయో యమలోకానికి ఎవడెళ్తాడురా వెళితే స్వర్గానికే
వెళ్ళాలిగానీ
గంద స్వర్గానికి వెళ్లాలంటే (గాంధీ సీసా తీస్తాడు
ఇద్దరూ తాగుతారు) ఒరేయ్ ! అయోమయం
అయో ఏమిటిరా గందరగోళం ?
గంద ఇవ్వాళ నిషా నషాళానికంటిందిరా
అయో అందుకే బలే హుషారుగా ఉందిరా
గంద హుషారుగా ఉండకపోతే ఉల్లిపాయలా ఉండ
చుట్టుకుని ఉంటామట్రా (ఎడమవైపునుండి రైతు
రామయ్య వస్తాడు)
రామ కలరాలో ఊరంతా అల్లకల్లోలంగా ఉంటే తప్ప
తాగి తందనాలాడుతున్నారట్రా ఒరేయ్ ! గందర
గోళం ! మీనాన్న వెంకటేసుకు వాంతులు ఆరంభ
మయినాయిరా

గంద మంచిది

రామ కళ్ళు తిరుగుతున్నాయంటూ మనిషి మెలితిరిగి కూలబడ్డాడురా

అయో అయితే మరీమంచిది

రామ కలరా తగిలిందని ఎవ్వరూ అ వైపుకు వెళ్ళడం లేదురా

గంద ఎందుకు వెళ్ళడం? వెళ్ళకూడదనేగా ఇక్కడున్నాం

రామ మీ ఆవిడ అంజమ్మ ఘోరంగా ఏడుస్తోందిరా

గంద అదెప్పుడూ అంతే ఇవ్వాళ కొత్త ఏముంది పాత పాటేగా దాని ముఖాన నవ్వు నా జన్మలో ఎప్పుడూ చూడలేదు

అయో మా ఆవిడ అందాలుకూడా అంతేగా ఎప్పుడూ సినిమాలో సూర్యకాంతంలా చురచురలాడుతుంది అందుకే నేను చరచర వచ్చేశాను

గంద అసలీ ఆడజాతి అంతా అంతేరా

రామ ఆటచేతకాక మద్దెల ఓడు అన్నట్లుగా ఉందిరా మీ వ్యవహారం ఉన్న ఆ సిరాసా మట్టిపాలు చేశారు

అయో అంతేనా పెళ్లాం మెళ్ళో పుస్తెకూడా ప్రాక్తి వేశాను

గంద మీ ఆవిడ ఊరుకుందటరా?

అయో చూస్తే ఊరుకుంటుందటరా అగ్గిబరాటా అవుతుంది ఆ దెబ్బతో మనం బుగ్గిపాలు కావలసిందే

గంద మరెట్లా తెచ్చావు?

ఒయో మత్తుమందులో నిండిన మెత్తని లడ్డు యిచ్చాను
ఐస్‌క్రీమ్‌లా అయినయి గుటుక్కున మింగేసింది
కళ్ళు తేలేసి ఒళ్ళు తెలియక పడుంది మొగ్గాది చెల్లిన
లాగేసి భళ్లున తెల్లవారేసరికి మార్వాడిపరం చేశాను
గంద దానితాలూకు సొమ్ముతో ఒకటోనంబరు బ్రాందీ
వచ్చింది వారెవా! ఒకేయ్! అయోమయం!
అయో ఏమిటిరా గందరగోళం?
గంద తేపటివంతు నాది ఈరోజు సాయంత్రానిక ఇల్లు
తాకట్టుపెట్టుకని షావుకారు జగన్నాథంగారు డబ్బు
యిస్తానన్నారు
అయో ఏ జగన్నాథంగారూ? ఆ కొంపావలా వడ్డీ
జగన్నాథంగారా?
గంద ఆయనే మహానుభావుడు! పొద్దున్నే లేచి ఆయన
పటానికి దణ్ణంపెడితే మంచిది వడ్డీ ఎక్కువయినా
అనుకన్న టైంకి కావలసిన పైకం అందజేస్తాడు
అయో అవును అయన అనేకసార్లు అన్నాడు మీలాంటి
వారి క్షేమంకోసం మా సింహద్వారాలు రాత్రిం
బవళ్లు తెరిచే ఉంటాయని
గంద ఆయనసింహద్వారాలు తెరిచేవుంటాయి మనసింహ
ద్వారాలను మూసేసి తాళంమీద తాళంబిగిస్తాడు
రామ ఓరి కుర్మార్గుల్లారా? ఆలుబిడ్డలను ఆకలిలో మాడ్చి
చంపుతూ వారి కష్టాన్ని తినడమే కాకుండా మాన
వతుల అమూల్యమైన మాంగల్యాలనుకూడా తెగ
తెంపులు చేయడానికి పూనుకున్నారా తాత,

శే మత్తు వదిలిందా ?

గంద ఎప్పుడో ఒప్పుడో

శే ఎక్కడికి పోయిన వారికి ఉపకారము చేయకుండా మిక్కిలి బేధమే

సంభవిస్తున్నావా ?

గం ఆ

శే కన్న తండ్రి కాటికి కాళ్లు చాస్తుంటే హలా సాగా తాగి

తూలుతున్నావా ?

గంద శేఖర్ !

శే కలరా మాట అటుంచి నీలాంటి పుత్రుణ్ణి కన్నందుకు

కుమిలి క్రుళ్ళి కృంగి నశించిపోవడానికి సిద్ధంగా

ఉన్నాడు

గంద నాన్నా ! (వెళ్ళబోతాడు)

శే ఆగు !

గంద (ఆగుతాడు)

శే ఎక్కడకెడుతున్నావ్ ?

గంద మా నాన్న దగ్గరకు

శే ఏం చేస్తావ్ ?

గంద ఒత్తిడించుకుంటాను

శే ఏవిధంగా ?

గం ఇంకెప్పుడూ పాడుపనులు చేయనని ప్రమాణం

చేస్తాను రాక్షసిగా మారినందుకు క్షమించమంటాను

శే నీలో పూర్తి పరివర్తన వస్తే మీ నాన్న బ్రతుకు

తాడు ఆ మార్పు కోసమే ఎదురు చూస్తున్నాడు

కన్న తండ్రిని కాపాడుకోలేని కుమారునికంటే కళంకిత

రాగా మేలు వెళ్ళి (కనిపైపక వెల్తూ,
ఒసేయ్! ఉద్యోమయం?

అయ్యో ఎవరు నువ్వు?

శే నీ కోటి వాన్ని

అ అంటే

శే నీ సాటివాన్ని

అ అయితే నాతో పాటు తాగగలవా

శే లేదు

అ తూగగలవా?

శే అదీ లేదు

అ వాగగలవా

శే ఉసలే లేదు

అ అయితే నువ్వు ఎందుకూ పనికిరావు పో

శే ఎక్కడికి?

అ ఇంట్లోకి

శే ఇంట్లోకా!

అ అవును ఇంట్లో కూర్చుని వంట చేస్తూ ఉండు నేనలా అంగడిలోకి వెళ్ళి అరగ్లాసు వేసుకొస్తా (వెళ్ళబోతాడు)

శే ఆగు

అ (ఆగుతాడు)

శే ఇలా రా

అ (వస్తాడు)

శే నిషా నిషాళాని కెక్కిందా

అ ఓ

శే కైపెక్కి కళ్ళు బైర్లు కమ్మాయా ?

అ ఓహో !

శే దిమ్మెక్కి తల తిరుగుతోందా ?

అ ఓహోహో !

శే (విగ్రంగా) అయోమయం

అ (తేరుకొని) శేఖర్ !

శే చివరికిలా పశువులా తయారయ్యావన్నమాట

అ వాడే వాడే ఆ గందరగోళమే

శే ఏమిటి వాడు ?

అ వాడు గందరగోళం చేసి త్రాగమంటె త్రాగాను

శే వాడు గడ్డితినమంటే తింటావా ?

అ అదెలా చేస్తాను

శే గంగలో దూకమంటే దూకుతావా ?

అ దూకితే మంచిదేగా పుణ్యమొస్తుంది

శే తెల్లారిలేస్తే పాపంచేసే నీకు పుణ్యమెలావస్తుంది అనుక్షణం అన్యాయాలు జరిపించే నీకు న్యాయం యొక్క విలువ ఎలా తెలుస్తుంది అడుగడుగున అవినీతితో సంచరించే నీకు నీతియొక్క ఖ్యాతి ఎలా తెలుస్తుంది ఈ అశాశ్వతపు ప్రపంచములో శాశ్వతమైనవి నీతి ఖ్యాతి ఆ అమూల్యమైన ఆయుధాలను పొందాలంటే అపూర్వమైన పుణ్యం పొందాలి అందరి గౌరవం సంపాదించాలి

అ డబ్బులేదుగా

# గ్రామోద్ధరణ

శే  డబ్బు పెట్టి కొనుక్కుంటే రాదు పుణ్యం మంచిపనులు చేస్తే వస్తుంది

అ  ఏం తప్పకుండా చేస్తాను

శే  అయితే మీ నాన్నగారి అంత్యక్రియలు జరపడానికి వెంటనే వెళ్లు

అ  (వెళుతూ ఉంటాడు)

శే  ఆ తాగుడు నీ మద్దశను చూసి కుములుతున్న నీభార్య దురవస్థను, దీనావస్థను రూపుమాపు ఇంకెప్పుడూ త్రాగనని ఆమెతో చెప్పు

అ  అలాగే మరయితే త్రాగకుండా పేకాడుకోవచ్చుగా

శే  ఓరి అయోమయం అలా చేస్తే నీవు సంపాదించిన పుణ్యమంతా పాపమవుతుంది నీ శ్రమ అంతా వృధా అయిపోతుంది నీవు బ్రతికినా చచ్చినవానితో సమానం

అ  ఏం మాట్లాడకలేనా ?

శే  నీవు మాట్లాడిన నీమాటలు ఎవ్వరూ వినరు

అ  మా ఆవిడకూడా వినదా ఓ మరిచాను మా ఆవిడ మా నేనే [illegible]గా

శే  నీవు త్రాగకుండా పేకాడకుండా ఉంటే నీమాట వింటుంది

అ, అయితే ఇప్పుడే వెళ్తా ఇంకెప్పుడూ త్రాగను, పేకాడను అని చెప్తా (ఎడమ వైపుకు వెళ్తాడు కుడి వైపునుండి రామయ్య వస్తాడు)

శే  బాబాయి ! మాష్టరు గారేరీ ?

రా పాలెంలో మహమ్మారి ఉగ్రరూపంతో చెలరేగుతుంది శేఖర్ ఒక్కడు సహితం రోగులదగ్గరకు వెళ్ళడానికి వెనుకంజ వేస్తున్నాడు కనీసం ఆయనను పలకరించేవారుకూడా లేకుండా పోయారు ఆబాల గోపాలం హడలి పోతున్నారు

శే ఇంత రోగాలతో ఆర్థిక యిబ్బందులతో అహర్నిశలు కుంగిపోతున్న అసహాయులకు సహాయము చేయడం బాధ్యతని తెలిసినవారుకూడా నిరుత్సాహముతో, నిస్పృహతో వెనకడుగు వేయడమా?

రా అవును శేఖర్ సహజంకాని వాతావరణం వెన్నంటుతూ అందరినీ ఆహుతి చేయడానికి సిద్ధమవుతూ ఉంటే ఎవరమాత్రం ఏంచేయగలరు? అంతా ఆ దైవ నిర్ణయం విధివ్రాత తప్పించటం ఎవరితరమౌతుంది

శే దేవుడిమీద భారంవేసి ఊరుకోవడమేనా? మన దేవులాటకూడా ఉండాలిగా

— మానవ శ్రేష్ఠమైన ఈ కర్మను మానవజన్మ అనుభవించాలిసిందే

— ఆపదను అడ్డుకోవాల్సివచ్చేసరికి అందరికి ఇలాంటి మెట్ట వేదాంతాలు పరిపాటి అయినాయి

రా పరిపాటి కాకపోతే గ్రహపాటులను మార్చగలవా?

శే ప్రయత్నించకపోవడం పొరపాటకదూ

రా నారుపోసినవాడు నీరుపోయకుండా ఉంటాడా? అన్నింటికీ ఆ మేఘశ్యాముడే ఉన్నాడు లలాట ఫలితం ఎలాఉంటే అలా జరుగుతుంది

శే అని మూగనోముపట్టి ముసలమ్మలా కూర్చుంటే భావిజీవితం భగ్నం కాదూ

రా అని పతివ్రత నెత్తిన వేసుకొని పరుగులు తీస్తే ప్రస్తుత జీవితం పాడు కాదూ

శే పాడయేవరకైనా ఇతరులు పాలుకాకుండా తూలిగా?

రా ఏమా శేఖర్! మాటలు బాగా నేర్చావు

శే అవును బాబాయ్! అగాధంలోపడి అల్లాడే మానవుణ్ణి రక్షించేటప్పుడుకాక మన నిస్వార్థాన్ని ఎప్పుడు ఉపయోగిస్తాము? నరకము దంట్లో కొట్టుకుపోయే సహచరుణ్ణి కాపాడేటప్పుడుకాక మన నిస్వార్థాన్ని ఎప్పుడు అమలుపరుస్తాము? పెరుతుఘాసను అణుమాత్రం తెట్టుకోలేని బీద ప్రజానీకాన్ని పోషించేటప్పుడుకాక మన నిస్వార్థాన్ని ఎప్పుడు వినియోగిస్తాము!

రా నిజం శేఖర్ నిజం నీమాటను అనుసరిస్తే సరియైన బాట లభిస్తుంది ఆ బాటనంటి ప్రయాణముచేస్తే జీవితగమనము సునాయాసంగా సాగిపోతుంది

శే సర్వప్రజ స్వేచ్ఛగా స్వర్గధామంలో సంచరించవచ్చు బాబాయ్!

రా కాని ఎంతమంది నీతో ఏకీభవిస్తారూ అని ఎంతవరకు నీ దీక్ష ఫలిస్తుందీ అని మంచిచేసేవాణ్ణి కూడా విమర్శిస్తుందిగా ఈ లోకం

(కుడివైపునుండి శాస్త్రిలు ప్రవేశం)

శా కలికాలమండీ! కలికాలం!

రా కలరావచ్చి చస్తేనే కలికాలమంటారేమిటండీ

శా అవునండి పాపం పెరిగిపెరిగి దండిగా పండి, ఎండి పోయి ఎక్కువగా ఉందండి

శే అంతా ఎక్కువైతే మీరు ఒంటరిగా ఒంపెలా తిరుగుతారటండి

శా ఇలా అధిక తెలివితేటలు ఎక్కువైతే అంతా అంతం కాక మరేముంటుందండీ

శే కనీసం మీబోటి సోమరిపోతులైనా ఉంటారుకదండీ

శా శేఖర్! ఏమిటా ప్రేలాపన?

శే శాస్త్రీ ఏమిటా ఆలాపన?

శా ఏమిటోయ్! ఎదుటవానిని చూచి ఓర్వలేని నీబాధ

శే ఎందుకోయ్! ఎంగిలిమెతుకులకోసం ఎగబ్రాకే నీ గాథ

శా కుక్కలా కూయకు

శే నక్కలా నటించకు

శా వ్యవహారం ముదిరి మారిపోయింది

శే కాలచక్రం చెడి మారిపోయింది

శా తలతిరిగితే సరి

శే మెడ నరికితే సరి

శా, ఆ బాపతే చెరువుగట్టున పడి ఏడుస్తున్నారు

శే వెళ్ళి ఓదార్చలేకపోయారూ!

శా ఏమిటా వాగుడు!

శే ఎందుకా మొరుగుడు?

నా రామయ్యగారూ విన్నారా ఎవరో మోగేది ?

రా ఎవరు మోగినా మోగనీ కరవవు కదండీ అందు చేత ఎవరికీ ఏ గొడవ లేదు కాని కాలయాపనమాత్రం తప్పదు పద శేఖర్ పద (ఎడమవైపుకు వెళ్తారు)

శే వెళ్ళేముందు ఒక్కసారి హెచ్చరించడం మంచిది

శా ఏం అలా సెలవిచ్చారు ?

శే గొప్పవారుకదండీ మీ పేరు ఊరూరా పాకిపోయింది

శా సంతోషం

శే మీరుచేసే పనులకు మీరు సంతోషించకపోతే మరె వ్వరు సంతోషిస్తారు

శా బాగా చెప్పావు

శే చెప్పడంలో ఏముంది ? నలుగురికీ తెలియచేస్తే ఉంది

శా ఏమిటి ?

శే మీ బడాయి

శా అందుకా ఈ లడాయి

శే ప్రజాసేవకుణ్ణంటూ చంకలు ఎగురవేసుకుంటూ ప్రజలను దోచుకోవచ్చమనుకున్నావా ?

శా మతిపోయినట్లుంది

శే తేరతిండి తెగతింటుంటే మతిపోకేం చేస్తుంది

శా ఓహో! అలాగా !

శే పరులసొమ్ము మేసేవాళ్ళకే ఇలాంటి సీటూ, గోటూ

శా (బిగ్గరగా) శేఖర్ !

శే నలుగురిసొమ్ము నరనరాలకెక్కింది అందుకే క్షణం కోపం, తక్షణం తాపం

రా ఆ
శే వరదబాధితుల సహాయార్థమని చందాలు వసూలు చేసి వాళ్ళ నోట్లో గుట్టికొట్టి ముత్యాలముూట కట్టడమనుకన్నావా?
రా నోగ్గ్నయ్
శే ఇంతకాలము నోరుమూసుకున్నాము కాబట్టి నీమోసం సాగింది
శా ఇకమీాదట?
శే దేవుని మాన్యములోని ఒక్క గింజకూడా ఇక ఇంటికి వెళ్ళడానికి వీలులేదు
శా అలా ఆజ్ఞాపించడానికి నీవెవరివోయ్?
శే ఆ ధాన్యాన్ని అనుభవించడానికి నీవెవరివోయ్?
శా అహోరాతులు దైవాన్ని ఆరాధిస్తూ కలకాలము నుంచి కన్నతండ్రిలా కొలిచే నాకు ఆమాత్రంహక్కు కూడా లేదేం?
శే లేకేం నేటివరకు జపతపాలతో అవివేకుల ఆస్తిని వివేకంగా వశం చేసుకోవాలని ఉబలాటపడ్డావు, ఉపక్రమించావు కొంగజపాలతో కష్టజీవుల కష్టాన్ని సుఖంగా సేకరించడానికి కలలు కన్నావు వలలు పన్నావు దేవునిసొత్తును దుష్టబుద్ధితో దోచుకోవాలని మంత్రాలు చదివావు తంత్రాలుచేశావు పాపపుపనులకు పూనుకోరాదని ప్రత్యక్షంగా ఉపన్యసించావు పరోక్షంగా విసర్జించావు
శా నాగురించి బాగా తెలుసుకున్నావ్

శే ఆ రోజు రాజుకీ నీబుద్ధి ఎంత అద్భుతంగా వికసించి పరిమళిస్తుందో అందరూ తెలుసుకుంటున్నారు
(కోటాయి కొడుకు దాసు కుడివైపునుండి వస్తాడు)

దా శేఖర్ బాబూ! శేఖర్ బాబూ!

శే ఏం దాసూ (భుజంమీద చేయివేస్తాడు శాస్త్రి ముక్కుమీద వేలు వేసుకుంటాడు)

దా మానాన్న ఎడి బాబూ?

శే, ఏం ఎందుకు?

దా మా అమ్మకు జ్వరం మండిపోతోంది చర్మము మీద చిన్నచిన్న పొక్కులు కనిపిస్తున్నాయి మశూచికము అని అనుమానిస్తూ ఎవ్వరూ రావడంలేదు నాకు భయంగావుంది

శే డాక్టరుగారిని తీసుకొని నేను మీ ఇంటికి వెళతాను కాని నీవు, గూడెంవెళ్లి నాన్నను తీసుకురా (కుడివైపుకు శేఖర్ వెళ్ళబోతాడు ఎడమవైపుకు దాసు వెళ్ళబోతాడు)

దా అలాగే బాబు

శా కలికాలమండ! కలికాలము మూల ఉండవలసిన మాలవాణ్ని చంక నెక్కించుకుంటే కాలం మాత్రం ఏం చేస్తుంది? కలరా మశూచిలాంటి అంటువ్యాధులు అంటకుండా ఎలా ఉంటాయి?

శే ఛీ! శకునపక్షి! (కుడివైపుకు వెళతాడు)

శా ఆ ఆ- (ఎడమవైపుకు తిరిగి) ఒరేయ్! అబ్బీ! ఇలా రారా!

దా అరేయ్ ఒరేయ్ అంటున్నావు మంచిగా, మర్యా
దగా మాట్లాడటం మంచిది

శా ఏరోయ్! ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా ?

దా దేవునిపూజ అంటూ దేవునిసొమ్ము దోచుకునే
దొంగతో

— అందరికీ పాకిందీ

దా ఈరోగం అంటురోగులనుమించిన రోగం కదండీ

శా ఆఁ

దా అవునండి కళ్ళుపోతాయంటూ ఎదుటివారికళ్లుమూసి
చేసే వ్యాపారం కదండీ

శా పళ్ళు రాలగొడతా

దా ఒళ్లు జాగ్రత్తగా కాపాడుకో

శా ఓరి కుంకవెధవ అంతవరకూ వచ్చిందీ వ్యవహారం

దా కొద్దిరోజుల్లో నీస్థితి మారి కైపెక్కిన నీ కళ్ళకు
కన్నీరే గతి అవుతుంది

శా ఏమిట్రా మీరంతా చేసేది ?

దా 'రా' అంటున్నావ్ జాగ్రత్త

శా ఓరి వెధవ

దా పోరా భడవా

శా నీ బాబుకుచెప్పి నీ జాతర చేయించుతా

దా ముందు నీబాబుకుచెప్పి నీ జాతర చేయించుకో

— ఆఁ ఆఁ నోరు తె స్తాడు

దా తిమిం ంంలా నోరు తెరిచావే ఏ ముత్యాన్ని మిం
గాలని బా బా (ఎంమవైపుకు వెళతాడు)

శా - ఈకాలపు స్త్రీలకు భయం భక్తి రెండూ లేవు, కలికాలము (దాసు వెళ్ళినవైపు మాస్తుంటాడు కుడి వైపునుండి వాసు వస్తాడు)

వా కలికాలంగారూ

శా ఈ పిడుగెవరు ?

వా మనమేనండి

శా అంటే ?

వా శేఖర్ బాబుగారి చిట్టితమ్ముణ్ణి

శా ఓహో! ఆయన తాడినిలంతే నీవు మొవ్వును తన్నేట్లున్నావే

వా బువ్వపెట్టకపోతే మా అవ్వనుకూడా తింటానండి

శా మీ అన్నకు తగిన తమ్ముడివిరా

వా మీకు మాట్లాడటమే చేతగాదండి

శా వాటకు దగ్గులు నేర్పేటట్లున్నావేరా ?

వా అదిగో మళ్ళా ?

శా ఏమిటాది ?

వా 'రా' అని అనకూడదు తప్పుకదూ

శా నాకు తప్పొప్పులు నీవటా నేర్పేది ?

వా పెద్దవారు పిన్నలుగా మారినప్పుడు బుద్ధిమంతులయిన పిన్నలే పెద్దలుగా మారవలసివస్తుంది

శా అప్పుడు పిన్నల మీద పెద్దపెద్ద బాధ్యతలు పడతా యేమో ?

వా తప్పకుండా చేస్తాం

శా ఏమిటా నీవుచేసేది ?

వా శాస్త్రిగారూ! ముందు ఆ 'శా' కొట్టివేయండి
శా మొత్తానికి నీవు అఖండుడివే!
వా మీకంటెనే సరేగాని, మా అన్నయ్య ఇటు వచ్చా రాండి?
శా నాకు తెలియకడుగుతాను మీ అన్నయ్యగారు నన్ను కాపలా పెట్టావా?
వా ఆఁ ప్రొద్దస్తమానము ఇక్కడే ఈ గ్రామ రచ్చబండ మీద తిష్ట వేసుకుని కూర్చొని అందరి జాతకాలు చూస్తుంటారుగా ఎవరెటువెళ్ళిందీ మీకు తెలుస్తుందేమోనని
శా అయితే మీ అన్నయ్య ఒక్కడినేకాకుండా అందర్నీ కాపలాకాస్తున్నాననటావా
వా అని నేనన్నానటండీ
శా అంటే డొక్క చీల్చనూ
వా చచ్చిన తర్వాతా? బ్రతికుండగానేనా?
శా చచ్చినతర్వాత స్మశానములో పీక్కుతినేవి నక్కలు
వా అయితే బ్రతికుండగానే మీరుపీక్కుతింటారన్నమాట
శా ఓరి ఫుండాకోర్ తిని కూర్చుంటే క్రిందమీద కన్పించటంలా
వా అంతా మీకుమల్లేనే అనుకుంటారండి
శా ఆఁ ఆఁ (పట్టుకొని కొట్టబోతాడు ఎడమవైపునుండి కోటాయి వస్తాడు శాస్త్రి వాసుని వదలివేస్తాడు కోటాయి వాసుని పట్టుకుంటాడు) ఆఁ ఆఁ వాణ్నిలా అంటుకోవకమే

వా  అంటుంటే నా ప్రాణం పోయింది

కో  శాస్త్రిగారూ! ఎందుకండీ చిట్టబ్బాయిగారిని కొడ తారు?

శా  మళ్ళీ మాట్లాడితే పాతివేస్తాను

కో  అంతపనే

వా, మరేమిటనుకున్నావ్ అంతా చచ్చాక పాతిపెడ తుంటే ఈయన బతికుండగానే పాతిపెడతారు

శా  చూశావా! ఎలా కూస్తున్నాడో!

కో  మీరు కోతలు కోస్తుంటే ఎవరైనా కూస్తుంటారు

శా  ఓరి పెద్దమ్మ ఏమీచేయలేని దద్దమ్మనంటావ్!

కో  నోరు మంచిదికాకపోతె నీరుగూడా పుట్టదు బాబూ

శా  పొట్టపొడిస్తే అక్షరంముక్క లేనివాడవు నీవు నాకు నీతులు చెప్పేవాడవా?

వా  ఈ కాలంలో అదే మీ కలికాలంలో చదువుకున్న వారికంటె చాకలివాడుమేలు అన్నారు

శా  చదువురాని మొద్దు కదలలేని ఎద్దు అన్నారు

కో  కదలకుండా మెదలకుండా ఉంటే ఏగొడవా లేదుగా

శా  ఇప్పుడు కదిలి ఏంచేస్తున్నారోయ్?

కో  కొంపలు ఆర్పుతున్నారు

వా  కొంపలార్పటం మంచిదేగా

కో  కాలేకొంపలు ఆర్పటం మంచిదే కాని కూడే కొంపలు ఆర్పడానికి సిద్ధమయి.

శా, ముందు నీ కొంపకాడి ఆ పాతుపాడట యాపు కోరా చటూ

గో ఆఁ
శా మీ ఆవిడ ఈసరికి ఎగిరిపోయి ఉంటుందేమో
క్రో ఆ
శా ఈ సిసింద్రీగాడి అన్న మీకొంపకే వెళ్లాడు
క్రో ఆ
శా మీ సీమటపాకాయగాడు నీకోసం ఊరంతా గాలిస్తు
న్నాడురా
క్రో , లచ్చి (వాసుని ఎత్తుకుని కుడివైపుకు వెళతాడు)
శా ఆఁ ఆఁ అ శూద్రుణ్ని అలా తీసుకుపోవడమే
ఓహో! కాలం మారిందిగా నా మొహం కాలం
ఏం మారింది? మనుష్యుల మనసులు మారాయి
గాని (పొడుంపీల్చి) అయినా ఎవడెట్టాచస్తే నా
కెందుకు ?
(పెచ్చివాడు నవ్వుకుంటూ కుడివైపునుండి వసాడు)
పి (అహ్హాహ్హా) ఎవడెట్టా చచ్చినా నీకేమీ లేదూ? మరి
నీవు ఛస్తే
శా నేను ఛస్తే చావను
పి దేవతలు తాగే అమృతం తాగావా?
శా నిత్యం దైవసాన్నిధ్యంలో కాలం గడుపుతున్నాను
పి దేవుని పేరు చెప్పుకుని ఆయన సొమ్మునే స్వాహా
చేస్తున్నావ్ (అహ్హాహ్హా) ఒక్కమాటడుగుతాను
నిజం చెబుతావా?
శా అబద్ధం ఆడటం నా ఇంటావంటాకాని, మా వంశ
ములోకాని లేనేలేదు

పి అవును అసలు మా స్వగ్రామం కదా ఇంతకూ మీకు పిల్లలెంతమంది ?

శా ఇంకా లేరు మూడుసార్లు గర్భం వచ్చింది

పి మీకేనా ? (అహాహా) మూడుసార్లు గర్భంపోయింది

శా నాకు కాదోయి గర్భం పోయింది మా ఆవిడకు డాక్టర్‌నడిగితే బలహీనమన్నాడు

పి కాదు బలహీనము కాదు

శా మరి ?

పి నీవుచేసే పాపం మీ ఆవిడ అనుభవిస్తోంది నీకు తెలుసా ? పాపం చేసింది నేను పిల్లలనుకంది మా ఆవిడ కష్టాలను అనుభవిస్తోంది పిల్లలు ఇంతకూ మీకు పెళ్ళయి ఎంతకాలమయ్యింది ?

శా పదిసంవత్సరాలయింది

పి నాకు పెళ్ళయినపదిసంవత్సరాలలో పదిమందినికన్నాను

శా కష్టపడి కృషిచేసి సంవత్సరానికి ఒక్కరిని కొప్పున కన్నానన్నమాట పుణ్యాత్ముడివి

పి అయితే నీవు పాపాత్ముడవన్న మాట (అహ్హాహా) అందుకే నీకు పిల్లలు లేరు

శా పిల్లలు వద్దనే కనలేదు

పి అయితే పెళ్లాం ఉసురు కట్టుకుంటున్నావన్న మాట

శా అలాంటిదేమీ లేదు

పి అయినా నీకు పిల్లలు లేరంటే నీవు మామూలు పాపివి కాదు గుడిని గుళ్ళోలింగాన్నికూడా మింగే మహాపాపివి (అహాహా)

నా — పదిమంది పిల్లలను కని పెళ్ళాం చచ్చిపోతే పిచ్చివాడవయిన చచ్చు సన్యాసివి నీవుకూడా నీతులు వల్లిస్తున్నావన్నమాట కలికాలం (అంటూ కుడివైపుకు వెళతాడు)

పి — నిజమే నేను పిచ్చివాణ్ని పిచ్చివాణ్ని పిచ్చివాణ్ని (అహహా) నా పెళ్ళాం శాంత చచ్చిపోయింది ఆమె చచ్చిపోలేదు నేను చంపేశాను నా పెళ్లాం శాంతను నేనే చేతులారా చంపవేశాను (అహహా) నేనెక్కడనుంచి వస్తున్నానో తెలుసా? పిచ్చి హాస్పటల్ నుండి కదూ! కాదు మామూలు హాస్పటల్ నుండే గవర్నమెంటు హాస్పటల్ నుండే మా ఆవిడకు తొమ్మిదవ కాన్పు నాకు పిల్లలెంతమందో తెలుసా? పదిమంది దశావతారాలు ఆ తరువాత పదకొండవ అవతారం అదే దరిద్రావతారం పిచ్చి అవతారం నేను ఎత్తాను [అహ్హహా] ఏయ్! నేను పిచ్చివాణ్ననుకన్నారా? కాను పిల్లలు కావాలని కన్నాను కష్టపడి కన్నాను ఎందుకనో తెలుసా? తాత ముత్తాతల సంతోషంకోసం అమ్మా నాన్నల ఆనందంకోసం కన్నాను ఆపరేషన్ పాపమని పెద్దలు చెబితే నిజమేనని నమ్మాను చిల్లిగవ్వ అప్పులేని నాకు పిల్లలే ఆస్తిపాస్తులుగా అండగా నిలబడతారని నా అనేవారు పదిమంది ఉంటే మంచిదని కలలు కన్నాను పిల్లలను కన్నాను నా ఆశలన్నీ నిరాశలయ్యాయి నా కాంక్షలన్నీ కరిగిపోయాయి

కొమిన్నిదవ కాన్పులో ఆడ కవలప్పిల్లలు కని కళ్లు మూసింది నా భార్య శాంత శాంతా! శాంతా! వెళ్లిపోయావా శాంతా! నాలో అశాంతిని లేపి శాంతంగా వెళ్లిపోయావా శాంతా? హృదయానికి హృదయమైన నా భార్య శాంత నన్ను శాశ్వతంగా విడిచి వెళ్లిపోయింది ప్రాణానికి ప్రాణమైన నా భార్య శాంత నన్ను ఒంటరివాణ్ని చేసి వెళ్లిపోయింది శాంతా! అదిగో నా భార్య శాంత మంటల్లోపడి మండిపోతోంది శాంతా! నేనూ వస్తున్నాను శాంతా! నీతోపాటు నేను వస్తాను శాంతా! వద్దు అవును వద్దన్నావు కదూ! పిల్లలను కనిపెట్టుకుని ఉండమని చెప్పావు కదూ? శాంతా! నీవు కన్న కవలపిల్లలు నీవు కన్నుమూసిన వెంటనే కెవ్వున కేక వేసి కన్నుమూసారు వాళ్లు నీతో నేవచ్చారా శాంతా! వాళ్ళను నీవు జాగ్రత్తగా చూడు మరి మిగిలిన నా ఎనిమిదిమంది పిల్లలు ఏరీ? ఎక్కడా? ఎక్కడు న్నారు? (అహహా) [పిచ్చివాడు ఎడమవైపుకు వెడు తుంటే ఎడమవైపునుండి దాసు వస్తాడు]

దా ఏడీ మా నాన్న! ఏడి ఎక్కడున్నాడు? నాన్నా! నాన్నా! (కుడివైపునుండి వాసు వస్తాడు) ఏమూ! మా నాన్న కనిపించాడా?

వా దాసూ మీనాన్న మా అన్నయ్య మీ ఇంటిదగ్గర ఉన్నారు

దా నీకెలా తెలుసు?

వా నేను మీయింటిదగ్గరనుంచే వస్తున్నా

దా ఆం ఈసంగతి మీనాన్నకు తెలిస్తే ఇంకేమైనా ఉందా!

వా ఏం ఏంచేస్తారు?

దా చావచితకొడతారు

వా ఏం ఎందుకు?

దా మా మాలవాళ్ళను అంటుకోవద్దంటారుగా

వా అంటుకుంటే ఏం మీరు మనుష్యులుకాదా

దా అనేగా మీ నాన్నగారి ఉద్దేశ్యం

వా అయినా మా నాన్నకూడా ఇదివరకటిలాగా మొండి పట్టుదలగా లేరు ఉన్నా లాభంలేదని తెలుసుకున్నారు

దా ఇంతకూ మా అమ్మకు ఎలావుంది వాసూ! మా అమ్మ బతుకుతుందా వాసూ!

వా మీ అమ్మకు ఏం ఫర్వాలేదని డాక్టరుగారు చెప్పారు

దా డాక్టరుగారా!

వా అన్నయ్య గూడెంలో కలరా ఉందని పాలెంలో మశూచి ఉందని గవర్నమెంటు డాక్టరుగారికి కబురు చేశారుగా

దా అవును ప్రొద్దున్నే కబురుచేశారు

వా డాక్టరు, వారి సిబ్బంది హెల్తు ఆఫీసరు వారిసిబ్బంది అంతా వచ్చారు ఇంకేమీ భయం లేదు అంటు రోగాలను అంతం చేస్తారు అసలు అంటురోగాలంటే ఏమిటో చెప్పు?

దా  రోగ శరీరమునుండి సూక్ష్మజీవులు ఎదుటకు వచ్చి ఇతరుల శరీరములందు ప్రవేశించి రోగములను వ్యాపింప చేయుట

వా  గవదబిళ్ళలు కళ్ళ కలకలు

దా  మహామారి, నారికురుపు

వా  సన్నిపాత జ్వరము కన్యెల జ్వరము

దా, గజ్జి క్షయ

వా  కలరా, తామర

దా  మశూచి విశూచి

వా  పొంగు ప్లేగు

దా  చిడుము, చుండు

వా  ఇవన్నీ అంటురోగాలే దాసూ! సూక్ష్మజీవులు మన కంటికి కన్పించవట

దా  కంటికి కన్పించకపోతే ఎలా చూశారూ

వా  పెద్దపెద్ద శాస్త్రవేత్తలు సూక్ష్మదర్శిని అను యంత్రాన్ని కనిపెట్టారట దానిలో సూక్ష్మజీవులు పెద్దగా కనిపిస్తాయట

దా  అవసలు ఎక్కడుంటాయి

వా  చెడుగాలిలోను, మురికినీటిలోను, కల్మష పదార్థాల లోను ఉంటాయి

దా  అయితే శుభ్రమైన గాలి, మంచినీరు శుచియైన పదార్థాలు కావాలన్నమాట

వా  అంతేగాదు ఇంటినీ వంటినీ శుభ్రముగా ఉంచుకోవాలి

దా  అంటే
వా  సూర్యుని వెలుతురు పీకు తగలాలి, చక్కని ఎట్లలు నీవు తగిలించుకోవాలి
దా  ప్రస్తుతం బాధపడేవారి గతి
వ  వారి స్థితినిబట్టి తగినంత జాగ్రత్త తీసుకోవాలి
దా  తప్పకుండాను
వా  నీటిని మరుగకాచి త్రాగాలి త్రాగించాలి
దా  అంటురోగులకు దూరముగా ఉండాలి, ఉంచాలి
వా  టీకాలు, సూదిమందులు వేయించుకోవాలి వేయించాలి
దా  దురభ్యాసాలకు లోనుకాకూడదు కానీయకూడదు
వా  ఈగలను, దోమలను నిర్మూలించడానికి మురికి గుంటలలోను నిలువనీటిలోను ఫినాయిల్ చల్లాలి
దా  తోక ఝాడిస్తూ క్రిములు కైలాసానికి వెళ్తాయి కదూ
వా  ఓ ! (నవ్వుకుంటూరు)
దా  ఇవన్నీ నీకెవరు చెప్పారు ?
వ  ఇంట్లో అమ్మా నాన్న చెప్పారు ఎల్లో మాస్టారు చెప్పారు మీ మాస్టారు ఇలాగా చెప్పలేదా ?
దా  అసలు నేను సరిగా బడికి వెళితేగా !
వా  ఏం, చదువుకోవడం లేదా ?
దా  ఆఁ ఏం చదువు ఒకపూట స్కూలుకు వెళితే రెండో పూట మానివేయడం
వా  పొద్దుక మానడం ! ప్రతిరోజూ స్కూలుకు వెళ్ళరాదూ !

దా  కాగుంది కూలికి వెళ్ళకపోతే కనుపు కాలిపోతుంది కడుపు చేత్తో పట్టుకొని 'అమ్మా ఆకలి, నాన్నా ఆకలి అమ్మా, నాన్నా ఆకలి ఆకలి' అంటూ బొచ్చె తీసుకొని బిచ్చమెత్తుకోవాలి

వా, మీనాన్న సంపాయిస్తున్నాడుగా

దా  మా నాన్న సంపాదించింది మా నాన్న తాగుకు కే చాలదు మరి అమ్మ, అయిదుగురు చెల్లాయిలు పస్తులతో మాడి చావవలసిందే పైగా ఊరంతా అప్పులు తిప్పలుపడి సంపాదించకపోతే ఎలా చెప్పు?

వా  మీ అమ్మస్థితిని చూచినతర్వాత మీ నాన్నకు చక్కటి బుద్ధివచ్చింది అన్నయ్యకూడా నచ్చ చెప్పాడు ఇంకెప్పుడూ తాగనని, ప్రతిపైసా కూడ బెడతానని పిల్లలమీద ఒట్టువేసి చెప్పాడు

దా  అయితే నేనుకూడా చదువుకుంటాను.

వా  నీకేగాదు బడి ఈడుగల పిల్లలందరినీ బళ్ళోకి పంపే ఏర్పాటు అన్నయ్య చేస్తూవున్నారు పిల్లలందరను అక్కడకు తీసుకురమ్మన్నారు టీకాలు వేయించు తారట

దా  అయితే అందరినీ తీసుకొని వెళదాం పద

వా  అలాగే గా వెళదాం (ఇద్దరూ కుడివైపుకు వెళుతూ ఉండగా శాస్త్రి కుడివైపునుండి నెత్తిన చెంగువేసు కొని వస్తాడు)

వా దా  నమస్కారమండి శాస్త్రిగారూ!

శా  (మాట్లాడకుండా వస్తుంటాడు)

వా నెత్తిన చెంగు వేసుకున్నారే ?

దా నెత్తురుచుక్క ముఖాన ఉన్నట్లు లేదే ?

శా మీ అన్నయ్య పూనుకుంటే నెత్తిన చెంగేమిటి ? చేతికి చెంబేవస్తుంది

దా 'భవతీ భిక్షాందేహి ! మాధాకవళం' అని అడుక్కోవడానికా?

వా ఆ పనిమాత్రం జరగదు

దా ఏం ? ఎందుకని ?

వా దేవునిమాన్యం ఉందిగా

శా ఇంకెక్కడి దేవునిమాన్యం ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నట్లు ఇదిగో ఓలిగ్రాం వచ్చింది

దా అయినా పిల్లా పాప లేని మీరు ఆస్తి కావాలనుకోవడం ఎందుకండి ?

శా ఇంతకాలం దేవునికిదయ కలగకపోతుందా వంశోద్ధారకుడు ఒక్కడు ఉద్భవించకపోతాడా అని అనుకున్నాను.

వా మరి ఇప్పుడు ?

శా అలాంటి ఆశ కనుచూపుమేరలో కన్పించటం లేదు

దా ఏం, ఎందుకని ?

శా నా పెళ్లాంకి గర్భిణీ పోవడం ఇది నాలుగవసారి గర్భిణీ పోతేపోయింది పెద్దప్రాణానికే ముప్పు వచ్చేటట్లుంది

వా , అని కబుర్లు చెబుతూ కాలయాపన చేస్తున్నారా ?

శా మరేం చేయమంటారు ?

పెట్టుకొని ప్రస్తుతం ప్రాణంపోయేవారి సంగతిని మరచిపోవటం మంచిదంటారా?

శా వాసూ!

దా పిల్లలు లేనివాళ్ళు ఉన్న పిల్లల్ని కూడా పోగొట్టుకుంటారా?

శా దాసూ!

దా ఏ క్షణంలో ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు

శా వాసూ!

దా అవును వానరాకడ ప్రాణంపోకడ తెలియదన్నారు

శా వాసూ! వెళదాం పద మాలగూడెం మీ యింటికి వెళదాం పద (శాస్త్రి దాసు వాసుల భుజములపై చేతులువేసి కదిలిపోతు వెళతారు పిచ్చివాడు ఎడమవైపునుండి వస్తాడు)

పి (అహాహా) నా ఏడుగురు పుత్రరత్నాలు మంచి పొజిషన్‌లోనే ఉన్నారు తల్లిదండ్రుల పేరు ప్రతిష్ఠలను పెంచుతున్నారు పెద్దవాడు పేకాటలో పెద్ద పేరు ప్రస్తుతం జైలులో ఇనుప కటకటాలను లెక్కపెడుతున్నాడు, రెండవవాడు రోడ్‌సైడ్ రోమియో ఆడపిల్లలను వేటాడుతున్నాడు ప్రస్తుతం హాస్పటల్లో ట్రీట్‌మెంట్ పొందుతున్నాడు ఆ తర్వాత ఒకడు బూట్ పాలిష్ ఇంకొకడు నెత్తికి పాలిష్ ఒకడు క్లబ్బుల్లో ఘాటుగావున్న నాటుసారా ఒకటే తాగడు నిద్రాహారం లేక వాగుడు: ఇంకొకడు కాఫీ హోటల్లో కప్పులు కడగటం అన్నవ్యాపారముచంద్రా

అని అడగటం ఏతవవాడు వాడిజీవితాన్ని సినిమా హాల్సుకు అంకితం చేశాడు కొత్తసినిమా వచ్చిం దంటే క్యూలో నిలబడి టిక్కెట్లను కొని బ్లాకుగా అమ్మి జీవితాన్ని గడుపుకుంటున్నాడు వాడి ప్రపంచమే వేరు సినిమా ప్రపంచం ఇక ఆఖరివాడు అంటే అష్టమివాడు అమావాశ్య ఆదివారం అర్ధ రాత్రి పన్నెండు గంటలకు పుట్టాడు అఖండుడు అమోఘ హస్తలాఘవం కలవాడు పిక్ పాకెట్ అంటే జేబులు కొట్టడంలో అందెవేసిన చెయ్యి (అహ్హాహ్హా) చదువు విషయంలో మావాళ్ళు అష్ట దిగ్గజాలు ఒక్కడికీ పొట్టపొడిస్తే అక్షరమ్ముక్క లేదు (మాటలు వింటూ రామయ్య వస్తూఉంటాడు) అసలు అ, ఆ లు రావడానికి బడిలోనికి నేను పంపిస్తే కదా అర్ధరాత్రివరకు నేను ఫ్యాక్టరీలో చాకిరీచేసి ఇంటికి వచ్చేసరికి వాళ్ళు నిద్రపోవడం – గింజాడు చీకటిని నెత్తినవేసుకుని బయటకు పోయేసరికి వాళ్ళు లేవకపోవడం – నాకు నిదచాలక కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రగా ఉంటే తాగుబోతునని ఆడిపోసుకుంది ఈ సమాజం అది నిజమేనని నమ్మారు ఆప్తులు నాతో బంధాలను తెగత్రెంచుకున్నారు ఆత్మీయులు (రామయ్య ఎడమవైపునుండి వస్తాడు)

రా: ఎవరు ఎలా అనుకున్నా ఎవరు నీతో బంధాలను తెంచుకున్నా నీ భార్యమాత్రం నిన్ను గౌర వించిందిగా

పి గౌరవించడమే కాదు దైవంగా పూజించింది అయినా భార్యగా ఆమె ఏం సుఖం అనుభవించింది అనేక కష్టాలను అనుభవించింది ప్రతిసంవత్సరం ఒక కాన్పు అనారోగ్యంతో అమితగాధను అనుభవించింది ఒక్కనాడు కూడా ఉల్లాసంగా మాట్లాడలేదు ఉత్సాహంగా తిరగలేదు

రా ఆమె అనారోగ్యానికి కారణం ఎవరు ?

పి , నేను

రా ఆమె చావుకు కారకులెవ్వరు ?

పి నేనే

రా కాదు

పి మరి ?

రా కాలం తీరిపోయింది ఆమె వెళ్ళిపోయింది

పి కాదు

రా మరి?

పి నా పాపం పండిపోయింది ఆ పుణ్యవతి వెళ్ళిపోయింది

రా అంత పుణ్యవతి అయితే ముగ్గురుపిల్లల తరువాత ఆపరేషన్ చేయించుకుంటే బాగుండేదిగా

పి ఆపరేషన్ చేయించుకుంటానని అనేకసార్లు అడిగింది

రా అయినా నీవు అంగీకరించలేదు

పి , ఆపరేషన్ చేయించుకోండి అని నన్నుకోరుతూ వుంది

రా ఆమె మాటను నీవు ఆచరించలేదు

పి కానీ నా ప్రతిమాటను తు చ తప్పకుండా ఆమె ఆచరించింది అంతేకాదు అన్నివిషయాల్లో చేసోడు

వరణంలో సక్రమమార్గంలో క్రమశిక్షణతో పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించి భావిపౌరులుగా తీర్చిదిద్దాలి. లేకపోతే కాలేకడుపే వారిని వక్రమార్గానికి ఈడ్చుకుపోతుంది. వారిలో మానవత్వం మటుమాయమై రాక్షసత్వం రభసచేస్తుంది. వారు సంఘ విద్రోహులౌతారు. ధనికవర్గాన్ని నాశనం చేయాలనే నినాదాలతో దోపిడులు, దొంగతనాలు సాగిస్తారు. అందుకే పథకం లేకుండా పిల్లలను కంటే సమాజంలో అరాచకశక్తులను సృష్టించటమన్న మాటే. అందుకే ప్రభుత్వపు ఎర్రత్రికోణపు గుర్తును గౌరవించాలి,

౬ యువకులు ఉత్సాహంగా ముందుకు రండి. తాత్కాలిక వ్యామోహాలను విడనాడండి. దేశ పరిస్థితులను పరిశీలించండి. ప్రజలలోగల చైతన్యాన్ని మేల్కొలపండి. జనాభా పెరుగుదలను అరికట్టండి. దేశాన్ని దారిద్ర్యంనుండి తొలగించాలంటే, కుటుంబనియంత్రణ అంటే ఫ్యామిలీ ప్లానింగు అమలుజరపండి. నాలాగా మీరుకూడా భార్యల బాధలకు వాళ్ళ చావులకు కారణం కావద్దు. శాంతా వస్తున్నాను శాంతా! నీవులేని నా జీవితం వృధా! నీవు నన్ను విడిచివెళ్ళినది మొదలు అన్నపానీయాలు విసర్జించాను. వీధులలో భిక్షకుడిలా తిరిగాను. కాళ్ళు తేలిపోతున్నాయి. కళ్ళు తూలిపోతున్నాయి. శాంతా! ఆఖరిక్షణాలు ఆసన్నమయినాయి. నిన్ను చేరుకునే

మరుక్షణం సమీపించింది శాంతా! శాంతా!
శాంతా! (క్రింద పడిపోతాడు)

[ వెనకనుండి పాట ]

సా॥ కూలేనా! నిరుపేదా!
తీరెనా! నేటితో ధరపై నీ ఋణం
ముగిసెనా నీ యీ విషాద గాథ

పా॥ నిరుపేదల బ్రతుకింతే కలగా తెలవారునులే
నావే నడిసంద్రాన కెరటాలలో మునిగెనుగా
ధనవాన్లు అందరికీ విధిలిఖితంబింతేనా
విధిలిఖితంబు ఇంతేనా
భారంగు నీ బ్రతుకు ఈక్షణమున ముగిసెనుగా॥కూ॥

(పాట అంతం అవుతుండగా రామయ్య శవాన్ని భుజముమీద వేసుకుని కుడివైపుకు వెళతాడు. ఎడమ వైపునుండి అయోమయం, గందరగోళం వస్తారు)

గంద ఒరెయ్! అయోమయం!
అయో ఏమిటిరా గందరగోళం?
గంద మన ఉద్యోగాలు ఊడినట్లేనా?
అయో ఏమిటిరా అవి?
గంద తాగుడు, పేకాట
అయో ఆ ఆ ఊడినట్టే మరేంచేద్దామురా?
గంద, వ్యాపారం చేదాం
అయో ఏం వ్యాపారం?

గంద వడ్డీ వ్యాపారం
అయో పెట్టుబడి లేదుగా
గంద నిజమేరా యే
అయో సారాకొట్టు పెడతాం, మన గూడెంలో వాళ్ళకు ఫ్రెష్ సరుకు సప్లయి చేయవచ్చు ఇక మనవాళ్లు బయటకు వెళ్లే పనేలేదు ఒయటవాళ్ళే ఎగబడి వస్తారు
గంద ఛ! ఛ!
అయో ప్రభుత్వం అందరికీ లైసెన్సులు ఇస్తోందిగా
గంద అయినా వద్దులేరా
అయో ఏం? ఎందుకని?
గంద మళ్ళీ మనం తాగటం మొదలెడతాం వల్లు గుల్ల ఇల్లు గుల్ల అవటమే కాకుండా తాగేవాళ్ళ అనేక కుటుంబాలనుకూడా నాశనం చేసినవాళ్లము అవుతాము
అయో నిజమే ఇకనుంచీ ఎవరూ తాగకూడదని ప్రచారం చేద్దాం
గంద అని తెడి ఆరకుండా తాగేవాడి దగ్గర చెప్పావళ్ళు హూనంచేసి కీళ్లు తీసేస్తాడు
అయో అప్పుడు హాయిగా 'ఔట్ కొట్టి బాబూ! బిచ్చమేయండి బాబూ' అని అడుక్కోవచ్చుగా
గంద ఛ, ఛ! ఇంతబతుకు బతికి ఇంటెనకాల చచ్చినట్లు అదేంపనిరా
అయో: మరేంచేద్దాంరా?

గంద కష్టపడి కూలీకిపోదాం

అయో వళ్లు వంచగలవా అని

గంద , మొకట్లో శాస్త్రం మూలిపించినా నెమ్మది నెమ్మ దిగా అలవాటై పోతుంది

అయో అయితే ఇక అదే న్యాయం

గంద అరుగో (కుడి వైపుకు చూపిస్తూ) మనవాళ్ళంతా వస్తున్నారు (శేఖర్, గోటాయి శాస్త్రి దాసు, వాసు రామయ్య వస్తారు)

శే అయోమయం, గందరగోళం ఏమిటాలోచిస్తు న్నారు ?

అ ఆలోచించటం అయిపోయింది ఒక నిర్ణయానికికూడా వచ్చాము

శే ఏమిటా నిర్ణయం ?

గం శాస్త్రింబవళ్ళు కష్టపడి పనిచేసి సంపాదించినదానిలో కొంత పొదుపుచేసి మదుపు పెట్టాలనుకున్నాము

శా గందరగోళం నీవేనా మాట్లాడేది ?

అ అవునండి శాస్త్రిలుగారూ ! మీరుకూడా మాదిగ గూడెంలో అడుగుపెట్టినట్టున్నారే

శా ఏమోయ్ పెడితే మాలమాదిగలు మనుషులు కాదనుకున్నావా ? అసలు మహాత్ముడు ఎవరు ! గాంధీ మహాత్ముడు మన జాతిపిత ఏమన్నాడో తెలుసా ? మాలమాదిగలే పూలమాలలన్నాడు

గం మరి ఇంతకాలం

శా బుద్ధి గడ్డితింది

అ మరి ఇప్పుడు ?

శే శాస్త్రీగారు మన గ్రామములోని చిన్నపిల్లలకు పగలు, పగలల్లా కాయకష్టంచేసి వచ్చే కష్టజీవులకు రాత్రి పూట చదువు చెప్పాలని ఉబలాటపడుతున్నారు

అ అయితే పలకా బలపం కొనుక్కోమంటారా పంతులు గారూ ?

శా ఆలస్యం అమృతం విషం అన్నారు

గం అవును మీ బుద్ధి పెడదారి తొక్కవచ్చు మా బుద్ధిలో పురుగుపుట్టవచ్చు

శా అందుకే తక్షణం కొనరా శిష్యా ఈరోజే అక్షరాభ్యాసం

దా మరి మరమరాలు శెనగపప్పు

వా, అంతేనా స్వీటు, హాటు

శా అవన్నీ అయోమయం, గందరగోళం వంతు నేను మాత్రం దేవుని ఉత్సవరోజున పాలానికి, గ్రామానికి కూడానికి సంతర్పణచేసి, సహపంక్తి భోజనం పెడతా

వా ఇంతకూ మా పాఠాలు ఎప్పుడు ప్రారంభిస్తారు !

శా రేపు ఉదయం

దా అయితే నేను బాగా చదివి ఇంజనీరునయి దారి, డొంకా లేని మన గ్రామాల్లాంటి గ్రామాలకు చక్కటి ప్రయాణసౌకర్యాలను ఏర్పరచుతా

వా నేను బాగా చదివి డాక్టరునయి అనారోగ్యంతో బాధపడే పేదవారికి ఉచితంగా వైద్యం చేస్తా

అందరు ఆరోగ్య సూత్రాలను అమలుపరిచేటట్లు చూస్తా

గో నేను వెంటనే వెళ్ళి పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకుంటా

రా నేను అధిక పంటలను పండించటానికి అనేక ఆధునిక పద్ధతులను అనుసరిస్తాను సెంటీమీటరు స్థలం కూడా వృధాగా పోకుండా రకరకాల ఆహార పదార్థాలను పండిస్తాను గ్రామస్థునిగా, రైతుగా నా విధిని నేను నిర్వహిస్తాను

శే ఇలా ప్రతి ఒక్కరూ గురుతర బాధ్యతలను గుర్తించి శాయశక్తులా తమతమ రంగాలలో అధికోత్పత్తులను ఆర్థిక పరిస్థితులను మెరుగు పరుచుకుంటే గ్రామోద్ధరణ జరుగుతుంది దేశం పురోభివృద్ధి గాంచుతుంది

అ, ఇంతకూ కలరా

శే పట్నంనుంచి వచ్చిన ఆరోగ్యసిబ్బంది ఇంజక్షన్లు ఇచ్చారుగా అదుపులోనికి వచ్చినట్లే

గం మరి మశూచి

శే గవర్నమెంటు హాస్పటల్ సిబ్బంది ఇంజక్షన్లు ఇచ్చారుగా ఉధృతం తగ్గినట్లే

వా ఆరోగ్యమే మహాభాగ్యము

ధా పరిసరాలను శుభ్రపరచండి,

శా నిరక్షరాశత నిర్మూలించండి

గో అంటరానితనం అడుగంటాలి

అ  మానవజాతి అంతా ఒక్కటే

గం  కుటుంబనియంత్రణ అమలు జరపండి

శే  గ్రామోద్ధరణకు ముందుకురండి

(అందరూ కలిసి పాడతారు)

## గేయం

లేలెండోయ్ కార్మిక సోదరులూ లేలెండోయ్ కర్షక సోదరులూ
శ్రేయోరాజ్య స్థాపనకోసం దీక్షవహించి రారండోయ్ ॥లే॥
పరిసరంబుల పరిశుభ్రతకు అంటువ్యాధుల నివారణకును
ప్రజాసేవ పరమావధియంటూ పురోగమించి ముందుకు రండి
అంటరానితన మెక్కడున్నను మంటగలపగ రారండోయ్
పిదిదీపములు చేయగరండి మనోదీపములు వెలిగించండోయ్ ॥లే॥
కుటుంబనియంత్రణ పథకంబులను వాడవాడలకు తెలుపండోయ్
అధికోత్పత్తిని సాధించంగ అడుగుముందుకు వేయండోయ్
కుల మత జాతి భేదం లేదని మానవజాతి ఒక్కటేనని
గ్రామోద్ధరణ ప్రణాళికలను జయప్రదంబుగ చేయండోయ్ ॥లే॥

